చుఁ గొండఱందు। ఎప్పుడుముక్కునఁగినక్కయీగాధిపట్టికిఁ జెం
దఁడోరుపటంచుఁ గొండఱందు। తెఱగంటిదొరమాట తెఱఁగెద్దివీ
రాడుకొను పెద్దవినుఁడంచుఁ గొండఱందు॥ లేరె? తగవ్రానియిట
వీరిపోరుదీర్చి। సందియముమాన్ప వారంచుఁ గొండఱందు। ఁజమ
రుగూడినవిన్నాణిచదురలిటుల। నొండొరులతోడననుకొనుచుం
డిరపుడు॥ 95

గీ॥ వెండిగాధికొమారుండుగండుమిగిలి। తీండ్రమాకినక్క చూడుక్కలు
వేంద్ర మెనయఁ। బండ్లుపటపటఁగొఱికియేర్పడఁగాంచి। కరు
సులడరవసిష్ఠుతోఁదరకటించి॥ 96

సీ॥ పుడమినంతయుఁదనతొడమీఁదదాల్చిన జడదారి మేటికశ్యపుఁడ
టుండ। కడలినంతయునొక్కపుడిసిటఁగైకొన్న పరఁటిపుట్టువుని
రాబారియుండ। అలగట్టుదాయ మేన్గలుఁగు లేర్పడఁదిట్టి దట్టించిన
ట్టిగౌతముఁడటుండ। బటువుఁగైదువజోదుఁబాటింపక ఱకాలఁబిట్టు
దన్నిన మేటిభృగువటుండ॥ నుద్దపిడి వేల్పు పెద్ద పెన్నుద్దియనఁగఁ।
దద్దయునుమీఱి నేనుండఁదక్కినట్టి। దండిజడదారులుండనీదుండ
గంపు। ఱుబుసుపోకలునీకేటికో వసిష్ఠ॥ 97

క॥ ఈమాయందఱకంటెఁ। గామిడివాయేలమించిగఱువంబలెనొ।
గాములుదలఁపకపలికితి। వా మేటికినింతనీకునౌరవసిష్ఠా॥ 98

క॥ నెలదారియానమెయిదా। ల్పులఁజిల్వలఁదొంటి వేలుపుల వేల్పుల
లో। ఁగలుగఁడునిజమరియొక్కఁడు। గలయఁగ వెదకినను ముజ్జగం
బులననుడుఁ॥ 99

మ॥ పెఱవారిఁగడులొచ్చుగాఁగనుటకీవిందీఱితందానీబల్।
గఱువంగాఁదగవింకవాకొనుటలేకర్ణంబుదానంగొలల్।

వెలుగుఁ నేనికఁ జెప్ప నేటికిచటఁ బెంపారువిన్నాణులం।
దఱుముం దేమన హెచ్చుతక్కువలచందంబుఁ బాదింగానరే॥ 100

క౦॥ పలువురుకూడినపట్టున। గలిగినయొకసందియంబుకనుఁగొనితన
కుఁ। దెలిసియుఁబలుకమిదోసము। గలుగునటంచెఱుఁగఁబల్కఁ
గల్గెనిజముఁ॥ 101

క౦॥ ఏటికినీయెడఁదగవుఁ। బాటింపకజగడమునకువచ్చెదువినుము।
మ్మాటికిలహరిశ్చంద్రుఁడు। పోటరినిజమరియుమాఱియుముజ్జగమం
నుఁ॥ 102

క౦॥ తలఁపునఁబలుకునఁజేతను। గలనైనన్మఱచియైనఁగడకెట్టిదె
సన్। దెలియఁగబొంకియెఱుంగని। వలఁతిహరిశ్చంద్రుఁడొకఁ
డవఱలుజగానన్॥ 103

క॥ పెఱచేడెతల్లినిక్కమె। నెఱనెచ్చెలియోర్పెకల్మి నెనరదెత్రాడ
పుఁ। నెఱితగవెనడకగాఁగల। యొఱపరియతఁడెంతకేనినూను
నెబొంకుఁ॥ 104

సీ॥ అలప్రొద్దుపడమటిమలచక్కిఁబొడమినఁబొన్నెలదాలుపుప్రుంగు
పడిన। దలఁగిగాములుమింటఁదమపోకమానినఁ గరువలినెచ్చెలి
కాఁకవిడిన। బ్రాఁతమిన్నుఁలజేజెప్రాఁతదప్పినముజ్జగంబులుదల
క్రిందుగాఁగఁబడిన। వేలుపుదొరచేతివేఁడివాలఱిగినఁదొనికిప్రా
ణెఱులింకిననుమఱియు॥ బుట్టరానట్టిగోరపుంజెట్టలన్ని। పుట్టి
ననుహరిశ్చంద్రుఁడుబొంకఁడనినఁ। గినిసికనుఁగవమిడుఁగుఱుల్
గెఱలగాధి। పట్టియిస్మాడిఁబలికెఁగోల్వక్కైతలఁక॥ 105

ఉ॥ ఒట్టుసుమీవసిష్ఠతుదకోటరివాదుత్రిశంకుపట్టిదాఁ।
గట్టిగఁబట్టినట్టినుడికారముడింపఁగడిందిచెట్టలన్।

బెట్టిదిటంబుపట్టుడిపి బెట్టిడలం బెనుఅట్టు దొట్టఁగా।
బిట్టలయించికట్టలుక పెట్టునఁగల్లరి తేపె చేసెదన్॥ 106

చ॥ తలఁపు సెలంగ నేనిఁజనితర్థయు వానికిదీనిమున్నమున్।
దెలపితిరంబు సైరణయుఁదిట్టతనం బెనయంగఁజెప్పియే।
వలనునసైనబొంకకనివై పొగి నేరిపి వేఁడుకొమ్మునీ।
యలవును వాని పెన్నెలవునాపయి నేఁగనుగొందునావుడున్ 107

క॥ వింటినుడి ‟తానుబట్టిన।కుందేటికిమూఁడెకాళ్ళు” గూడెననంగా।
బొందెలుఁగవొరులపిన వే। మందును నెఱజాణనంచు ననుకొం
దు వెదన్॥ 108

క॥ తగవునకు లెంకిపుడుపం। దెసువపు నెఱపాదినిజము తెఱుకువకిసైౖ।
తగు వాఁడదినీ వెఱిఁగెదు। ‟జగ మెఱిఁగినపాఱునకునుజన్నిదమే
లా”॥ 109

గీ॥ తొలుతఁబుట్టించినప్పుడే నలువ వానిఁ। గడిఁదినిజమరిగాఁ జేసెఁ
గ్రమమునకుఁ। బుట్టుతోడ నె నెత్తావిపొనరినట్టు। లతఁడునికరపుం
బ్రతినకునైనవాఁడు॥ 110

గీ॥ సొరివినినుఁబోలు వే వేలుజోగి తేలు। గూడిరూతని డెందంబుగుత
లపఱవి। జెప్పరంబునముంచినఁ జెప్పఁడెపుడు। మఱపుననునైననొ
కకల్లమాటనోట॥ 111

చ॥ విడిముడిఁబాసినన్ నెలవుపీడినఁజుట్టలఁగోలుపోయినన్।
బడఁతిదొఱంగినన్ బసుపుబన్నముఁజెందినమాలఁగొల్చినన్।
కొడుకటునీల్గినన్ దుదకుఁగొంతము చేఁదలిద్రేయనున్న నే।
ప్పు కొనుద్రిశంకుపట్టివినుబొంకఁడు వెండియు నెట్టివంతలన్॥ 112

గీ॥ అటులబొంకినఁదబిసి రాతుటుమునకును। దొలఁగి వెలినయి నేర్చిన
తొంటిమినుకు। లెల్లదిగనాడి జందియ మేటఁగలిపి। బోడిపైనెమాఱు
వేసంబుఁ బూనిచనెద॥ 113

గీ॥ అనుచుగొల్వట్టె బెగ్గిలమందగాధి। యనుఁగుఁగొడుకుదిగ్గున లేచి
యగ్గలంపు। టలుకవొడమఁగ నటదండనడరుతబిసి। మిన్నలను
గాంచి వేలుపు మున్నెఁజూచి॥ 114

గీ॥ వినుఁడు నే హరిశ్చంద్రుని వెగ్గలంపు। టుక్కివములకులోఁజేసియు
కుక్కెరెడపి। పెకుక్కెకడగండ్లపాల్పడఁబెట్టి మాట। ఁదప్పఁజేయు
దుఁజేయకతప్పిచనిన॥ 115

సీ॥ ఓలిగాలియునీరు గ్రోలిపెకేర్పడులు వలిమల నెలవుననిలిచితొలు
త। ఁగడిఁది నేమంబున వెడకన్నదొరఁగూర్చి తనివినేఁజేసినతబు
సులోన। సగమిచ్చియాపైనజగములుదగునన దడవు వేలేఁడులు
పుడమివాని। యసమువెసల్ నిండఁబోసఁగంగ నేలించి వెండి
యువానిని నిన్నువీడ॥ ఁగడిమిఁబదునాల్గుమనువులుగడచుదాఁక।
ఁగ్రాలునీ తేనిదొరసరిగ దైమీఁద। బటువుఁ గైదువ వేల్పుమిన్నుఱత
దాల్పు। నలువయు నెఱుంగని బుపుమఁదలఁగకనుడు 116

కం॥ చదలదిరెఁ బుడమిప్రిదిలెఁ। జెదరెఁ సంద్రములు మొదటిచిల్వ
యుఁగదలెఁ। విదిలెఁ జుక్కలు దెసలుఁ। బదరెఁ గొందలొందవ
వేల్పు పదుగుఁ బెదరెఁ॥ 117

సీ॥ చూచెదీవనిపోవఁజొచ్చె వసిష్ఠుండు కనియెదవని లేచె గాధిపట్టి। ప
రిందు గెలిచెడివారం చు వేలుపు దంటవీడ్కొనెఁ దెటుగంట తబిసి।
విరలనడుమహోవైతలపాలా హరిశ్చంద్రుఁడంచనిరుసుల్ జాలిఁ
వెడలి। రింతమట్టుననన్ను నేమనకేవీరు చనిరంచుమలసూడుబ్బదు

రుపడిచె। తరుఁగలవేల్పులకుఁటాతబుసుఁజేసి। యాసలను
గోసిచెఱురోసియీసుఁదుదకు। బాయలేఁదైరియీనిరాబారులం
చు। వెడలిరఁతటతమతమవిడుదులకును॥ 118

ఉ॥ మావులనోముపంటమరుమావులపండువుజాజిమంచునె।
త్తావులపట్టుఁగొమ్మబలితంపువిరాళికిఁబుట్టినిల్లుగ్రొం।
దీవెలపెట్టుఁజెట్టుపిరిద్రిమ్మరితుమ్మెదదాఁటుమేలుబల్।
కోవెలదండుతోడుకడుగోమునమామనివచ్చెనంతటన్॥ 119

గీ॥ కానసిరివచ్చునామనియేనిఁగాంచి। తమనిఁగేల్సాఁచినీరిచ్చితావి
దూప। మునిచెననఁదీవియల బారుననలఁగాలు। తేనియలసోరు
క్రొందేఁటితీరుమీఱు॥ 120

సీ॥ కమ్మనినెత్తావిగ్రమ్మెడుక్రొమ్మావులగుగుదెంచినపేరఁటాండ్రుగాఁ
గ। చెలువుబల్గులుకుఁరాచిలుకక్రొంబలుకులు దనరమ్రోసెడు
వాయిదములుగాఁగ। నోలిమైననతేనెఁగ్రోలియాఁడెడు తేంట్ల
తెగకప్పురవేలిమిపొగలుగాఁగ। చలువతెమ్మెరనేలవలపుగొల్పఁగ
రాలుపూలుపైనిడుసేసఁబ్రాలుగాఁగఁ। బూవుఁదీవియతెవతాలి
బొట్టుగాఁగ। నలరుపుప్పొడిచాల్పెండ్లియరుగుగాఁగ। బరఁగెలగ
నంబుకన్నులపండువగుచు। గానకన్నెకునామనియేనికపుడు 121

గీ॥ కానచానకునామనియేనికపుడు। పరఁగముత్తైదువలుసేరిపాటపా
డి। దిగదుడిచితీయఁబట్టినతొగరునీళ్ళ। నంగఁదీవెలఁజివురులున
లువుమీఱె॥ 122

గీ॥ చెలిమిననకారుదొరకానచెలియఁగూడి। యొండొరులుదండఁబా
యకయుండునట్టు। బాసగొనఁదామువ్రేలిమిఁజేసికొనిరొ। యన్నఁ
గనునుకెంపుమోదుగయలరులలరు॥ 123

చ॥ పుడమిపడంతి వేడఱఁదనముద్దుకొమారితఁగానకన్నెన।
ప్పుడునన కారుమన్నియకుఁబొల్పుగనిచ్చియుఁబచ్చవన్నెమే।
లుడుగరలూనవారలకునోలినొసంగెననంగఁజెట్లనే।
ర్పడఁదనరారెనంతనునుపచ్చనియాకులుదట్టమైరహిన్॥ 124

సీ॥ గొనబుమీఱఁగనల్లుకొనియున్నమవ్వంపుటీరంబుపడకటిల్లైరహిం
ప। లలిఁగ్రిందఁబ్రాఁకుమల్లెలపూలజొంపంబుతలిమంపుపాన్పుపై
చెలువుగొలుప। ఁబొన్నగున్నలఁదీవెప్రోవుపెనంగినడంబుప్రావి
ల్లుకయ్యంబుఁదెలుప। నాగిఁగొమ్మలనుఁగ్రమ్మిచిగురుక్రొమ్మొగ్గలు
వాడముమైపులకలపొలుపుఁజూప। ఁదలిరుఁదిండులనులిగిలుఱప
లుకఁగాఁగ। చెలఁగుననతేనెసోనమైచెమటగాఁగ। నొలయుపవ్యో
రవెడలు నిట్టూర్పుగాఁగ। ఁగలసిరయ్యామని వలంతికానచెలి
యు॥ 125

సీ॥ చలువతెమ్మెరలఁజెంగలువ కేళాకూళినొలయుతుంపురులుచిట్టు
ములుగాఁగ। నెత్తావిక్రొంబూవుగుత్తులపైవ్రాలుబలుతేంట్లుచ
న్మొనలుపుగాఁగ। బొలుపొప్పుబలువివ్వతెలిదమ్మిపూఁచొప్పుచెలు
వారనెమ్మోముతెలుపుగాఁగ। గలువదూఁడులమెకిఱకదలనొల్లని
యంచనడలుబత్తిన్ననినడలుగాఁగ। నటులఁజూలాలుఁదనముననద
నెఱింగి। యొట్టకేలకునకాఱనయిగురుబోఁడి। కోరెఱలలరంగఁగొ
మరులన్గొమరుఁబంట్ల। ఁగాంచెఁగన్నులపండువకలిమిదోఁప॥ 126

గీ॥ అట్టిననకారు నేలఁబేరరిదిఁగ్రాల। జన్నమొనరించి వెసహరిశ్చం
ద్రుఁడప్పు। డీవులను నేలవేల్పులనెల్లఁదనిపి। పరఁగుటయునంతవిని
గాధిపట్టియపుడు॥ 127

క॥ ఇదియదను నేనువడిఁజని। పదపడిజన్నంబు పేనుఁబన్నిదునీనిఁక।
గొదగానియొడమె వేఁడియు। మదిగలఁచియు వానిప్రతినమాన్చె
దనన్నుచుఁ॥ 128

సీ॥ తొగచాలునగఁజాలువగడాలు తెగనేలు నిడువాలు జేగుఱుజడల
తోడ। లలివెన్నెలనుగన్న తెలివన్నియలఁజెన్ను దేఱెడి వెల్లజం
దెములతోడ। తెలిమబ్బుబలుగబ్బు వెలిద్రొబ్బు చెలువబ్బుబసు
మంబుతిగరేకనొసటితోడ। నును కెంపులనునొంపుపని పెంపుఁగని
మంపుఁబొనతుమేల్ రుచురాకప్రోవుతోడ॥ వెలయ మొలఁగ్రాలు
పులితోలువలువతోడ। నొలిప్రేవెలెడు చిఱుకక్క పాలతోడ। ప్రాఁ
తమినుక్కలకుదిపేల్పు పలుకుతోడ। ఁగ్రన్ననవయోధ్యకరుదెంచి
గాధిపట్టి॥ 129

సీ॥ మగరాలనిగనిగల్ జిగులీన నొకచోట నొకచోటఁబచ్చరాలొరిమ
ఁదెలుప। ఁగప్పురాల్నిడలుగుప్పింప నొకచెంత నొకచెంతఁగెంపు
ఱాలొఱపునింప। ఁబిల్లికన్నతనాలబెళుకొప్ప నొకమ్రోలనొక
మ్రోలముత్తెంబులురువడింప। ఁజిలువఱాఱాడాలుదులకింపనొ
కక్రేవనొకక్రేవఁబవడాలయొప్పుగుప్ప। ఁనొక్కపజ్జనువిన్నాణు
లొలిఁగూడ। నొక్కచక్కినిమన్నియలొదిగికొలువ। నిండుపేరో
లగంబుననుండుతేని। లలిహరిశ్చంద్రుఁజేరముంగలికిడాయ॥ 130

గీ॥ అటులఁజనుదెంచుజడదారినరసి ఱేఁడు। గొలుపుపీటనుడిగిబత్తివె
లయనతని। నెదురుకొనియజ్జదమ్ములకెఱఁగి తెచ్చి। దీవెనలుఁగాం
చిపలికెఁదా దెలివికలిమి॥ 131

గీ॥ వాసినేఁదొలిబాములఁజేసినట్టి। తబుసుకతనఁగడామీరుదఱిలియి
టకు। వచ్చుటలులేకనాబోఁటివానికెటులఁ। దమ్ముఁగన్గొనుటబ్బు
నోతబిసిమేటి॥ 132

గీ॥ నేనొనర్చినజన్నంబు నేఁడుగాదె। తనరఁగొనసాగెఁగోరుకలుదని
విఁబండె। తాము వేంచేసినట్టికతంబదేమొ। యానతీయ రెయన
గాథియనుఁగుఁబట్టి॥ 133

గీ॥ అలరమానిసిరూపూనినట్టియీవి। చెట్టటందురునిను ఱేఁడబెట్టు
లోన। ఁబెట్టులోననునినుబోలుదిట్టలెచటఁ। బొడమియుండరులే
రిప్డుపుట్టరింక॥ 134

గీ॥ చెల్లఁబో? వేల్పుమొదవును జిక్కెడంత। పాలు వేఁడెదుకరణిశిసినొ్
లి నేఁడు। సుద్దులాలయంగ నేనొక్కకొద్దిపాటి। యీవినడుగంగ
వచ్చితినో వజీర॥ 135

క॥ నిడుపలతొడవుల యొడయఁడు। గడుమెచ్చఁగజన్నమూనగడఁగి
తినాచే। విడిముడిలేనికతంబున। నడుగఁగ వచ్చితిని బ్రేల్మికై తగుల
పకఁ॥ 136

గీ॥ ఎదిగిమానిసియేనుఁగునెక్కఁగవ్వఁ। జదలమీటినపొడవుసామ్మొదవ
బ్రేల్మి। పూరటిల్లును జన్నంపుఁబున్నెమునను। బొమ్మువిడిముడినొ
సఁగిమోపుడమిఱేఁడ॥ 137

క॥ అనుడుహరిశ్చంద్రుఁడుమది। దనివిఁ సంతసముఁగాంచితబిసివ
లంతీ। కొనుఁడిదిగొయొడమెఁగడుచ। య్యననింతటిపున్నెము బ్బె
నా నాకనుడుఁ॥ 138

గీ॥ ఏనునీమదిఁగనసంటినిటులఁగాక। ఱేఁడజగమున నీవంటివాఁడుగ
లుగ। గొఁజంతయేనాకుఁబసిఁడికిముదువ్వకైన। వచ్చికొవియొదనె
ప్పఁదేవలయునెడల॥ 139

తనఁబజ వారివారి చెయిదంబులఁ దప్పక ప్రాని యొండొరుల్।
చనువున నుంచు రేపగలు సంతసడి దండడిఁగాన కేయెడన్॥ 145

చ॥ వలసిన యుప్పుడే సిరియు వానలు మున్నగ రాలి నట్టిగిం।
జలుపడి పండుచున్న కయ సంతసమందుచు మయ్యనిచ్చలున్।
గొలుచులఁ బాఁడి చేఁబసులకున్ గడుఁబచ్చిక లేమి యెట్టిదో।
తెలియక యుంటిమై నవిను దేవర నిన్నఁటి నేఁటినుండియున్॥ 146

సీ॥ పలువన్నె పులుఁగులు వాత్మకంబులు నేలయీగాని నక్కైవడి నెన్నరాని।
వగుచుఁ గానల పిడియస్థాడి పజ తెల్లమండాడఁ జెలువుల మంట గెడ
పి। దొడ్డితోఁటల నెల్లఁ దోనబోకారిచ మఃశ్చఁ బైరుల రూపుమాపి
యంతఁ బోవక పెంపెక్కి కావరంబునఁ గొట్టికలఁ జొచ్చి పజలపైఁ
గదిసి మిగులఁ గాసిపఱచుచునున్న పికాఁపురములఁ జేయు నీయపు
మస్మైం మసిలుగులంది। యూలుబిడ్డల వదలి నేఁడరుగుదెంచి। నా
రమాదట ప్రోపు వజీరమమ్ము॥ 147

చ॥ అనవుడు గాఁపులన్ మిగులనక్కటికంబొలయంగఁ గాంచి వేఁ।
జనుఁడి దెవచ్చి మీ వెరపు జాఱఁగ వేఁట మెకాలఁ జంపి మే।
లొనరఁగఁ గూర్తు మీకు వగపొందకుఁ డుల్లమునందు నంచుఁ జ।
య్యన దొరవారి వీక్షాలి పెనంతటఁ దోఁచెను సంజ క్రొంజిగుల్॥ 148

సీ॥ వన్నెత్రాడుమనీని వాల్గంటి కేంగేలఁ దనరంగ నిద్దకెందమ్మి యనఁగ।
నాలవింటి దొరగొండ్లిసలు పనజ్జఁదొఱంగి క్రిందికై పడునందె కెం
పనంగ। ఁదఱిబోయ చేఁగూలి యొఱగినపగలను నెరసరి మెడనె
త్తురి కరుడనంగఁ। గటిక చీఁకటి కాటుకను బట్టఁబడఁగాటి తెఱవము న్వె
ట్టినది వ్వెయనఁగ। గ్రుంకు చట్టునకవ్వలఁ గొఱలు పుడమి। సరవి నే
లంగ వెసహరిశ్చంద్రు తేని। పనుపునను బోవు బలుచుట్టువాలనం
గ। ఁబొనఁగఁ బడమటి గుబ్బలిఁ బ్రొద్దు వ్రాలె॥ 149

గీ॥ ఇంతవఱకును నన్నేలి యిపుడు పీఁచ। నగునె ముందెన్ని బాములకే
నినిన్ను। (ఁబాయనని ప్రొద్దువోఁడ మెడుచాయకపుడు। చనియె ననని
డతోఁలిగట్టుదసుకసాగె॥ 150

సీ॥ తెఱఁగంటి చెలుబుపిన్న బతసీరాడమున్నారగట్టిన కెంపు చీర లేమొ।
పడమటిగట్టుకుఁ వడఁ బ్రొద్దు తేజీల కాళ్ళ రేఁగిన దుమ్ము కావియే
మొ। ముసిమూపు చీఁకట్లఁగని జేపె తెగటార్తునని ప్రొద్దు సూపు కన్ని
సుకయే మొ। సూడురా కాసుల తోఁడఁ బ్రొద్దనిఁ జేయఁబాఱిన నెత్తు
రువఱదయే మొ। పడమటి పడంతితోవ సూడు వచ్చుటరసి। యలరి
యారతి నిడనెత్తినట్టి కెంపు। పళ్ళెరపుఁ జాయలోయనఁ బరఁగన
పుడు। జక్కునిక్కుల కెంజాయ సంజదోఁచె॥ 151

గీ॥ నింగి పైదలి వంటఁ జేయంగ డంగి। పరఁగు పడమటి సంద్రంపు బావిసీ
రు। (ఁగోనఁగ హాలు వ్రాళ్ళ బలు కెంపుఁ గుండఁగట్టి। విడిచె ననఁ బ్రొ
ద్దు పడమటి కడలిఁ బడియె॥ 152

గీ॥ వేల్పు రాచానజడి సామి వెలఁది కపుడు। నంద చెలికత్తె చేజగా చెం
దిరంపు। బరణిఁ బంపెనో యనఁ బచ్చవారువంపు। టోడయుఁడు
మునింగెఁ బడమటి కడలిలోన॥ 153

గీ॥ చనెడుఁ జెయిదపు సాకిరి జంకకింక। వచ్చి మావల వంతఁ దీర్పంగ రా
డె। యనుచు నెలఁగూర్చి తోవకన్నె లడిగిరనఁగ। నెలవులకుఁ జేరఁ
బులుఁగులును లివ్వోసర్చె॥ 154

చ॥ వెడలఁగ నెట్టితిఁ బగటి వెల్గు వజీరుని నెవ్వఁడింక నన్।
దొడరఁగ లండటంచు బలుతోరపుటామిన మేను వెంచి పే।
రడరుచు రేయి సోఁకుబు వియ్యాకసముల్ వెస నిండ నొల్లెడన్।
గడఁకఁ బఱుందెనో యనఁగఁ గాఱిగులో పైజగానఁ నంతటన్॥ 155

సీ॥ ఇదిగదా వెలిగొండ యేకిమీనిసుత్తుక రాణనింపగు మేల్మిరవణము
వ్వో। ఇదిగదా నెఱజాణ పదివేసములసామి పూయని మైకప్పు
పూఁతయవ్వో। ఇదిగదా తోఁగచాలు నేలుచల్వల తేని కదఁగ్రాలు
చెన్నారుపదకమవ్వో। ఇదిగదా జేజేలయేలికకింపైనరతనాలకీల
పుటాల్జతనమవ్వో। ఇదిగదా జాలులకలయుంటిబంటి। నెఱులనూ
గారుకురులకు నెఱిబెడంగు। పన్నె యయ్యొంటుం చెల్లపజలుపలుక।
నెనఁగజగమెల్లఁగారొ నెనరులనెలుఁగు॥ 156

గీ॥ ఇరులనెనడొంగ పటుత్ర పరిపసించె। నాఁడికోనిపాటిగీలుల
టాఁచుకొనుట। గనుచుఁబట్టుపైక్రొ వ్వపనుపవచ్చి। నట్టిబంట్లని
దివ్వయలమరెనిం॥ 157

సీ॥ తఱివేసు రేపేఁడుదరలివచ్చునటంచు వినువీదినిడినదివ్వె లొయ
నంగ। గ్రొన్నెలరాకకైవిన్నకేళాకూళిపచ్చిన తెలికల్వ పరుల
నంగ। దనముగండరుదెంచునని వేడ్క పడిరేయిమిగుదకొప్పునని
డ్డమొల్లలనఁగ। గటికచీఁకటిమబ్బుగా నెంచి వెఱపొందియరుగఁ
బై కెగరినయంచలనఁగ॥ సందయసటయుఁజెన్నారుచందమదా
ల్పు। నట్టువఝొనర్పనాదలిపట్టువాఁక। నుండిమొగిరినతుంపరలో
యనంగ। నుప్పరంబునరిక్క చాలొప్పెనపుడు॥ 158

చ॥ కొమరుసెలంగఁగల్వ తెగకుందెడలంగఁగనింగిపీదిరే।
కొమయొడయుండుస్వారినిబకుఁజను దెంచుచున్నవాఁడటం।
చమరఁగఁదెల్పుమున్నయనవ్యోడివేగులవారివెండిబె।
త్తముల బెడంగనంగఁదొలితట్టునమున్దెలుపొప్పునొప్పుగ॥ 159

సీ॥ అదిశేలుపులబువ్వయాకాడుమిన్నెట దొరుగంగఁదేలెడు సురుగు
నాని। అదినిండురేవెలుంగాకాడు జేజేగాచెలియచేఁగలమల్లె

చెంపుగాని। అదియిర్ల వేరువిత్రాకాముమరుఁడొత్త దంబుమైనె
త్తువిందంబుగాని। అదికల్వచెలియవిందా కాదురే చానక్రొవ్వె
దముగజాలకుప్పెగాని।అదికడలివెన్నయూ కాదుపమురునిరుల।గౌ
రుజంపఁగఁగడఁగుసింగంబుగాని। యంచుబఁజలాడనించుపిల్చెం
చుటనుఁగు। మించుసంచులమినుపంచమించెనపుడు॥ 160

చ॥ విసురతనంబుగ్రుంకనెలవేగిపరాళిఁదలిర్పుచూడిరఁగ।
స్తోనవిరినమ్మికొన్మతనకూరిమియేలిక మోముఁదప్పలాఁ।
తినిదిలకింతునేయనినతీరున మోడ్చె మొగంబుఁగల్వజ।
వ్వ...తెగతాళి రేవలఁతిఁబన్నిరనన్ వెసవిచ్చె మోములన్॥ 161

సీ॥ తమ్ములఁజెనకు రేద్రిమ్మరియని పేరువాసిద్దె వాటినవాఁడితండె।పిన
నాఁడెవంకరతనమూనియొరుల మేల్పాటులుచూడ్కికిఁగానివాఁడి
తండె। దూపరియునినికిఁ దూపటిమైచనుఁబదియాలుపాళ్ళ మైవ
లఁతియితఁడె। పుట్టిననాఁట నేపుట్టినింటినిఁబోటు పాల్పడఁజేసిన
వాఁడితండె పాలుసీరుగఁగరగింపఁజాలుకడిఁది। వేఁడఁడే తెఱడు
చూడుఁలవాఁడితండె।యనుచునత్తఱివలవంతయగ్గినుడుకు। ము
గుదలాడంగఁదోఁచెఁజెందొగవటూరి॥ 162

గీ॥ విన్నుకల్వంబువనుదఱివెజ్జుఘంము।నూఁదినూఱంగఁజెనరినపాద
రసపు। గుళిగెలనఁజుక్కలమరెనుకూర్చికలువ। నిడినవెన్నయన
న్నెలపొడుపుదోఁచె॥ 163

చ॥ తఱియను నేఁతగాఁడుదొలిఁదానొడబడ్డవితంబుదోఁపవి।
న్నైఱవకు వెన్నెలన్ జిలుఁగుఁదెల్లనిరెంటమునేసి వెండిపూల్।
గొఱలఁగనంతటన్ బయఁటకొంగున మేల్జరిఁదమ్మినల్లనా।
వఱలెనుచుక్కలున్ నెలయువాసిగనాకసమందెసత్తఱిన్॥ 164

గీ॥ రేవెలందుకచను దెంచు రేవలంతి। గప్పుఁగలిందినఁదినదుచన్నవన
లందు।పునుఁగుకస్తురియొదనం టెననఁగ నెలను।గందు వాఁడగఁ గ్రొత్తైఁజూ
డిఁ-కినందముగను॥ 165

సీ॥ నల్లెమొల్లల రెల్లువల్లి బిల్లిఁ బెనంగి వెల్లయొల్లుల డాలుఁ గొల్లలాడి।
వెండికొండ బెడఁ గుఱపిందు మెందుఁగఁ జెండ కండచక్కెఱ రపిండిదం
డఁబండి। కందువ చెందమ్మియందంబు గ్రందించి చిందంపు బిందం
పుఁజంద మొంది। ముత్తెంపు టెత్తుల నత్తమిల్లి చెలంగి సత్తిత త్తడితో
డ నెత్తనాడి। పాలనిగ రాలనగి మూలజాల ప్రాలి। క్రాలు నెలరా
ల నేలిక ప్రాలఁ దేలి। సోరిమిను ప్రోలిజాలులోనోలలాడి। యలరనె
ల్లెడ వెన్నెలలల్లుకొనియె॥ 166

గీ॥ కొడుకు పుట్టిన వేడుకఁ గూడి మిగుల। బాలసంభ్రమంబు మిన్నందఁ బ
ర-గనంప। గ్రాలు వెన్నునికై వడిఁ గానుపించు। నందముగఁ గం
దు చెందొవపిందు నందు॥ 167

క॥ అడలకుఁడు మిమ్ము నే లెదు। నొడయుం డరుదెంచునంచు నొగిఁ దమ్ముల
కున్। నుడువఁగ వేగరి వచ్చిన। వడువున మును వేగుచుక్క వాసిన్
బొడిచెన్॥ 168

చ॥ తొలిదెసవాలుఁగంటి నెలతోడు కొమారునిఁ గాంచఁ గాన్పునొ।
ప్పులు వడుచుండఁగాఁ గెలనఁ బ్రోడలు గన్గొని తాఁ ఘుముజ్జగం।
బుల నడరించు మేలొక్క-డు కు పుట్టెడు నీకెపుడున్ శుభంచుమం।
చలరఁగ నూఱడించిరన నత్తఱిఁ బుల్గులు గూసె నెల్లెడన్॥ 169

చ॥ త్రొగలు గలంగఁ దమ్మి తెగ దోరపు వేడ్క-ఁ జెలంగ జక్కవల్।
బెగడెడలింగఁ బేరడలి వెన్నెలపిట్టలు బల్లలంగని।
గ్లొగి-దొలగంగఁ దేఁటిగములో రెములన్ గొఱలంగ నింగిపై।

ఁబగటివెలుఁగుఱేఁడపుమ్రాఁకెఁబెడఁగుమెఱుఁగురంగులన్॥ 170

సీ॥ తొలిదెసమాగాణిదొరపాన్పుపైనిడ్డ దిట్టమౌకెంబట్టుదిండనంగ।
సంపతిర్నాళ్ళకై చనుతఱిదాహరి కైసమ్మివెలయు జేఁబలియనఁగ।
పడమరదెసచానయడరఁగ్రొ సేయ ముందరనిడుకొన్నయద్దంబనం
గ। తొలిసుట్టగవియనుకొలిమినితఱికమ్మ తీఁడుకాచినయుక్క తెట
యనఁగ॥ ఁగడలిదొర వేల్పుసామికిఁగానుకఁగాఁగ। ఁబంపినని
గారపుంగెంపుబంతియనఁగ। ఁదోఁచె నెలజోడు చీఁకట్లఁదోలువా
ఁడు। కలువవిరిసూడు కెందమ్మివలపుఱేఁడు॥ 171

కం॥ తెలతెలవేగెన్ జుక్కలు। పలపలఁదే జెడలి నెల్లనా ఱెన్ బులుఁ
గుల్। కలకలకూయఁదొడంగెన్। దొలిసులపైఁబ్రొద్దు దోఁచె.
దొరపుజిగితోన్॥ 172

క॥ అనిమార్కం డేయుఁడు చ। క్కనిమాటలవిన్నమానికపుమునుము
నికిన్॥ వినిచిననవ్వాలికతయున్। వినిపింపుమటంచుఁదన్ను వేవేఁ
డుటయున్॥ 173

శా॥ ఎన్నేవేఁడివెలుంగు వేలుపులపేరేరాళపుం జేజుచే।
నెన్నంగాఁగడుమించి ముజ్జగములన్ హెచ్చిల్లఁగాఁ బాడిపా।
డిన్నిండించి నెఱాజగాముగితిపాటిన్ జేర్పఁబ్రాపాచుఁగ్రా।
లన్నేటించినచుట్టువాలువలకేలన్ దాల్చు పెన్వేలుపా॥ 174

క॥ సరిలేని వేల్పసోఁకున్। దొరచాల్పునడంచు పైఁడిమప్పటిదాల్పా।
ఉరుకూర్మితావకొరిన। సిరులిడు వెలియూవచేవచెలువులప్రోవా॥
175

భాస్కరవిలసితము॥——గొల్లతలనుదమిగొల్పినవాఁడా కూరిమినెన
రులకునరగుపిడా। వెల్లువయమునున వెన్నెడుఱేఁడా వేసఱఁబొఁగ

తుఱవిఱదినప్రోడా। కొల్లగసిరులిడుఁగుబ్బెతతోడాగుబ్బలికోమ
రితఁగొనుదోరయీడా। కల్లరితెగలఁబోఁకార్చెడుసూడాకాపు
రమునుబలుకడలికినోడా॥ 176

గద్య॥ ఇది శ్రీనీలకంఠేశ్వరాభిధపరమేశ్వరవరప్రసాదసంభూతసకల
కలాకుశలకులాలకులపారావారకళానిధిమండలమండనాయ
మానోర్వీమండలాఖండసత్కీర్తివిభవమండితగుండయ శ్రేష్ఠి
నాగార్యకులసంజాత శ్రీమద్వైష్ణవసిద్ధాంతోద్ధారకాగ్రంకితిరు
మలతాతాచార్యవర్యశిష్యప్రశిష్యవట్టివేళ్ళగోత్రోద్భవ అయ్యా
నకోటతిరుమలశ్రేష్ఠితనూభవ ఆంగ్లేయభైషజ్యకర్మచాతురీధౌ
రేయసరసకవితానికాయ విద్వజ్జనవిధేయపార్థసారథిశ్రేష్ఠి
నామధేయప్రణీతంబైన శుద్ధాంధ్రనిర్వచనకావ్యంబును సత్యవి
జయనామాంతరంబునునగు హరిశ్చంద్రోపాఖ్యానంబునందుఁ
బ్రథమాశ్వాసము॥ 177



శ్రీ

# —*ద్వితీయాశ్వాసము*—

క॥ సిరులడుగఁబడుగుపాఱుం। డరుదెంచినఁగాంచితొంటియనుఁగగు
టమదిన్। గరమలరిపూజెలిడియు। బ్బురపున్గోరికలనిడినపున్నె
పుదిట్టా॥ 1

క॥ వినువాఁకయలలరవళికిఁ। బనుపడుఁగ్రొన్నెలుఁగునుడులపన్నికవె
లయన్। వినిచెమ్మకండునికొడుకి। య్యనువుననాగొంతిచూలిక
వ్వలికతయున్॥ 2

గీ॥ అట్లు వేఁబోకయగుటయు నవ్వజీరు। ఁడగుహరిశ్చంద్రుఁడట ము
న్నెయలరమేలు। కాంచివలువాతిచేయ్వులఁగడఁకఁదీర్చి। వేఁ
టఁబోవీటఁజాటింపవేడ్కనంత॥ 3

సీ॥ పల్లజుంజులు నెఱుల్ పసమువ్వపైఁగోర తలరుమాలులఁజుంగులా
లయఁజుట్టి। గజ్జెలంచులమ్రోయఁగావిచల్లడములఁ దొడిగిదిండీఁ
డునైపిడియములను। బూనిజేగులుచుక్కబొట్లనెమ్మోముల నిడి
పూసలసరాలమెడలఁదాల్చి। గిలుకుసంబువులనజ్జలమెట్టి యెడ
యాక కప్పురొప్పునొడళ్ళఁగావిమెత్తి॥ కత్తులుఁగటార్లుఁగేడె
ముల్ కరగసములు। బల్లెములుబంట్రకోలలుఁబట్టియములు। గండ్ర
గొడ్డండ్లుబలువిండ్లుఁగరకణీలుఁ। గలిగిచనుదెంచిరటవేఁటకరులు
మఱియు॥ 4

క॥ సెలకట్టెలురులు తెరలున్। జిలుకులు దీమములు వలలుఁ జిక్కంబు
లుబోనులుఁ ద్రాళ్ళుఁ బసులుఁ బోఁగులుఁ। గలిగి రహిన్ గొందఱం
డుఁగన్గొని ఱేనిన్॥ 5

సీ॥ బూవిదేవర కేలఁ బూనరు లేడిన్నైన వలలకులోఁ జేయునలవు నేర్తు।
మిత్తిదేవర మోయుతత్తడి నెనుఁబోతునైనఁ జేతులఁ గ్రుమ్మి మెసుప్ర
త్తు। మలపట్టికడడాసి మెలఁగు సింగమునైనఁ గఱకుమీసలఁ బట్టి
కదిసి తెత్తు। కడలబల్ రెంటఁ ద్రాగుడులనైనఁ బెనంగి తొండముల్
తుండింపఁ దొడరనోర్తు॥ వెకరిదన మొప్పఁ దోలిముట్టె మెకమునై
న। ఁబట్టి గిట్టింపఁ గలగట్టిదిట్టనయ్య। నంచు వేర్వేఱుఁ దమతమయల
వుబలువు। నుగ్గడింపుచునుండిరి పెద్దలెసఁగ॥ 6

సీ॥ గొలుసులు సడలింపఁ బులులఁ బట్టెదమంచు నెఱిఁ గించువపిమ్ముం
దుకీడ్చునవియు। మేకొల్పఁ దొంటి తామేటిఁ జీల్చెదమను తీరుఁ దె
ల్పఁగ నేల జీరునవియు। నుసికొల్ప నిరునాల్గు దెసల హత్తుల ద్రెత్తుమని
తెల్పు మాడ్కిఁ బిట్టఱచునవియు। చెలరేఁప మెకపు రాశియ్యె ద్రిమింగ
దమంచుఁ దెల్పునైకైవడి నోళ్ళఁ దెఱచునవియు॥ నగుచు బెబ్బులిసు
డిగాలి బిగితుపాకి। యడవి ద్రిమ్మరి గడివోతు పిడుగు తునియు। మొద్ద
లుగాఁ బేరులందిన మొఱసడములు। సరిపెణలఁ బట్టి తెచ్చిరాకరులు
వేగ॥ 7

గీ॥ ఇటులఁ జెంచులు బుజములు పటితళ్ళింవి। కొనుచునట వేఁట కేఁకారి
కొనుచు రాఁగ। ఁగనిహరిశ్చంద్రుఁ డడవికిఁ గదలఁ దేరు। నాయితం
బంతఁ గావింప నానతీయ॥ 8

సీ॥ పసిఁడి ఫ్రౌరంగుబల్ పడగల చిఱుగాలిఁ దెలివాఁకఁ గలనీళుల
లలు నెఱప। ఁగట్టిన గంటలఁ గలుగురాయిడివించుఁ గొమరునచ్చ

రు వెల్లగొండ్లినలుప। వెలిజన్నియల్లులఁదిలకించి తెలిదమ్మ లంగా
మి న్నేటిరాయంచలడర। మగజాలబండ్లబల్లిగఁగాంచి నెల ప్రోష్ఠ
లనివిచ్చితోవతమ్ములలరనొకట॥ బు త్తళిహొంబరంగుబ త్తళిపా త్ర
ళంబు। గ త్తళంబులుఁజెలువారఁగ త్తళాని। ము త్తవెంపంపయుమా
త్తినక్రొ త్తతేరు। ద్రోలఁదెచ్చినఁగనుఁగొని నేల తేఁడు॥

సీ॥ పులుఁగుదాల బెడంగుబొమ్మడికంబును దాల్చికట్టాణి మేలుచొకట్లఁ
బూని। హురుమంజిముత్తెంపుసరములఁగీలించిపగటుచెందమ్మికా
పసకమూని। తలిరుచందురుకావిదట్టిగట్టిగఁగట్టి వలిపెరెంటను
వల్లెవాటువైచి। సిరిగందమున్ దావిచెలువులీను మెత్తి కస్తూరినా
మంబుఁగాంచినుదట॥ ఁగేలసింగాణితూపులుగీలుకొలిపి। కెంపు
పావలమెట్టివిసెఱంపు తేజు। ననుహరిశ్చంద్రుఁడప్పు డాతన నెలం
తఁ। గొమరునింగూడి తేరెకఱఁగోరివచ్చె॥ 10

ఉ॥ వచ్చికొమారుఁదేరుపయి వైశ్యముబంగరుపీఁటనుంచి కే।
లిచ్చి వెలందిచంద్రమతి నేర్పడనాయరదంబు నెకఱఁగాఁ।
బుచ్చిపరాకు వేగరులుపొల్పుగఁదెల్పఁగ నెకిఱతానుపెం।
పచ్చుపడంగఁదేర్నడుపనానతినిచ్చిననంతఁగ్రచ్చులన్॥ 12

ఉ॥ బంగరువాగెయున్ దళుకుఁబకెఱరయున్ ననుపట్టుపల్లమున్।
సింగిణియున్ లకోరితెగఁజేర్చినబల్లాదియున్ సిరాజిడా।
లుంగరవాలుచేసురియలోనగుకైదువలున్ దలాటమున్।
రంగుగఁగ్రాలు తేజినడరన్ వెససాహిణిదెచ్చెఁదెచ్చినన్॥ 11

చ॥ అరసిజరీరుమాలునిడియంగిరకంబుగఁదాల్చిజాళువా।
సరిగహొంబరంగులాగునఁబసందుగఁగా నెబిగించివల్వఁజె।
చ్చెరఁగయి సేసిబత్తళికఁజిలుకలుదాలును గేలఁబూనిచం।
తిరియగుసత్యకీర్తియటఁదేజిపయిన్ నడినెకఱవేఁటకున్॥ 13

సీ॥ సైదువల్ బట్టియాఁకరులు రా నొకయూర నొకయూరఁ బలుచెంచు
లు జెదిఁ బాఱ। బాబాలతుటుములు బలసి రా నొకప్రకర నొకప్ర
కర నేనుంగులో లిఁగదల। బల్లిదులగు పెకుర బంట్లు రా నొకచక్కి
నొకచక్కిఁ గాలరులు బికిన డవ। తగువారు జోదులున్ దవిలి రా నొ
కచాయ నొకచాయఁ బ్రెగ్గడలొరిమఁ గ్రాల॥ దప్పెటలు బేర్లుఁ బ
లు వాయదములు రవలి। గడలగా రులజానుగల్ గడెలువడఁగ। బ
డవలంబున నడిదంపు బెడఁగులడర। వెడలె నొడయుండు గడువడిన
డవికపుడు॥ 14

సీ॥ వరికయ్యలకు నీళ్ళు వాటించి కొలఁదిగఁ గలబెట్టి మడకలఁ గట్టువారి।
గనిమ లేర్పరచి చికరఁ గనాకు నెరువులఁ ద్రొక్కి వెంబడి ద్రమాను
దోలువారి। విత్తి పైరొక యింత యెత్తు ప్రోదినిఁ గన్నఁ దేకువఁ గలుపె
డదీయువారి। విరివిచోటుల పైరు వెలితిపట్టుల నెల్ల నాటుకొన న్నా
టువాటుపెంరి॥ బండగాఁ గోసి కట్టలఁ బన్ని తెచ్చి। కళ్ళములఁ గొ
ట్టి బంతులఁ గట్టఁ జేసి। గడ్డిఁ ద్రొక్కించి వడ్లు రాఁగాంచువారి। గ
నిహరిశ్చంద్రుఁడవ్వలఁ జనుచుఁ ద్రోవ॥ 15

చ॥ ఊలవలుఁ గొఱ్ఱులున్ బెసలు నుద్దులు నూవులుఁ గంది ప్రత్తిస।
జ్జలు నలసందలున్ సెనగ చామలు మున్నగు మెట్టపంటలన్।
జెలఁగెడి చేలయొప్పిదముఁ జెంతలఁ బ్రెగ్గడలో లిఁ దెల్పరా।
వలఁతి పొలంబులన్ గనుచు వైభవము న్ననుచుండి వెండియున్॥ 16

సీ॥ పసులెంచుఁ జేల పైఁ బడునంచుఁ జెలకోలఁ గలిగియిట్టటుఁ జూచి కా
చువారి। మంచెలనుండి హోహో యంచుఁ బుల్గులు దాయ నీయక వ
డిసెల లేయువారి। నజ చేతనలిచి పొట్టా అగనూదిన జొన్న పిసుకుళ్ళ
వాయూడ మెసవువారి। కంకిఁ బట్టినఁ బాలుగా అదంటులఁ బంటన

మలిపిప్పి మొకింతయుమియు వారి। ప్రత్తివిడిపించు చేలలఁబాడు
వారి। పెరిగియదన్నైనయులవను బెలుకువారి। కొఱ్ఱసజ్జలచామ
మలఁగోయువారి। గాంచుచూరులఁబల్లెలఁగడచియిట్లు॥ 17

క॥ వంటెంబులవణితంబుల। బంటలమఱితనవిలాతి పజనుకములఁ
దా। గంటఁ గనుచుఁ దనవా। ల్గంటికిఁ గాన్పించుచరిగెఁ గానఁ
దటియఁ॥ 18

చ॥ చనఁజనఁ జేఁడుకాఱడవిచాయనొకానొకచోటఁ గాంచెఁగా।
రెనుములపాలుజాలుగొనియేర్పడు నావఱదఁ మునింగిచ।
య్యనఁబడియీాదలేకనుఱులయ్యెడఁ బాసినవాత్మకాలవే।
దిననరుదెంచి వెల్లువను ద్రెళ్ళినపికుఁ మెకాలపెకుఁవఁ॥ 19

గీ॥ పనుఁగులమస్తి వెల్లువలేదుపంది। నేయికాల్వలుఁ జేరిముస్నీరులగు
చు। నడరె వెదురులనుండి రాలెడిసుపాణి। సందరపుముత్తియం
బులజాడఁదెలుప॥ 20

సీ॥ చఱియలపైనుండిపఱతెంచు సెలవాఁక మొసగనొదలవేల్పు టే
ఱుగాఁగ। విన్నంటుమ్రాఁకులవ్రేలుపేరూడలు బెడఁగులీనెడుకా
విజడలుగాఁగ। దవిలివేసఁగిగానరవులుమంటల తేజు కనరెడిచి
చ్చఱకన్నుగాఁగ। దెఱనోటిమెకముల తెలివన్నెయల చెన్ను రా
ణనొప్పారుమైరంగుగాఁగ। వ్రాలుమొయులుల దాగ్దారుతోలు
గాఁగ। గ్రాలువెదుతులుమున్మొనవాలుగాఁగ। విన్నుసిగదాలుపరిఁ
బోలువింజగట్టు। గదిసియద్దొరయటనాల్గుకడలనరసి॥ 21

మ॥ నేరెడుల్ కలజువ్విమోదుగునెమ్మిగున్మడునివ్వఁ।
మారెడుల్ పులిచింతకానుగుమావిక్రోవులురావులుఁ।

బూరుగల్ గలగొట్టుబొట్టుగు బొద్దిలొద్దుగు మద్దులున్।
బీరలున్ మొదలైనచెట్టుల పెంపునన్ గడుదట్టమై॥ 22

సీ॥ మెకపు రాదారి బీతి మెయిఁజిక్కి తలఁకునేని కలెల్లు లోడుఁగు మ
నీలు గాఁగ। బ్రబ్బునీఱపు టిర్ల మబ్బులంచని యాడు సిగపుల్గు లెల
యాట చెలులు గాఁగ। బండు వెదుళ్ళపైనుండి రాలుసుపాణిబలు
దీవిదారలకప్పములు గాఁగ। నెడనెడఁ బలుకు కోయిలలుఁ జిలుకలుఁ
గైతఁబరఁగించు మేలుక యీనరులు గాఁగ। బ్రోలప్రాఁకుల నొం
డొంట్ల మొనయు కొమ్మ। టెంకి మెకములు గరిడి జెట్టీలు గాఁగ। జడ
ల మెక మొండు దొరగాఁగఁ జదురుఁబోలఁ। జాలు నొక కానఁ గని
హరిశ్చంద్రుఁడెదుట॥ 23

సీ॥ మత్తిల్లు పెనుహత్తి మొత్తంబు వడి మొత్తి మెదడు మెక్కెడు గండు
మెకపుదొరలు। పుట్టపట్టుల బారుగట్టి కన్నట్టెడు చలిచీమలను బీల్చు
నెలుఁగు పరులు। చఱియలం గలకొండ గొఱియలన్నుఱుమాడి యె
అనెత్తురాను బల్చి ఱుతగములు। కుబుసంబులను వీడుకొని యొండు
సందడి సైఁచని మసకపుం ద్రాఁచు గుములు। యీరములఁ జూఱిపా
ఱెడు నేమబందు। లేటులాడెడి యెనుబోతులెగుగుకొదము। లేళ్ళు
దుప్పులు మంతతో డేళ్ళు కణుజు। వఱదుకుం దేళ్ళు వెలసిన వలఁకుల
రసి॥ 24

క॥ చెంచులను గాంచి యిచ్చట। మించున్ గడు మెండు గండు మెకము
లుమీరల్। డించని యలవున బైఁజని। త్రుంచుండనఁ జోపు వెట్టి తో
డరుచు వారల్॥ 25

ఉ॥ కాంచి మెకంబులన్ వలలఁ గాలురులన్ బఱపించ జాడలే।
త్తించి మెఱంగు బల్లెములనీటెలబల్ని గుడించి ప్రోగు వా।

ఱించిరకంపుదీములగుఱిన్ మెలఁగించికడంగిబోనులో।
డ్డించిహుటాహుటింబరఁగి రేడ్తెఱ వేఁటకు ఱేఁడునత్తఱిన్॥ 26

ఉ॥ తేరును వేడిగ్గితన దేవెరిముద్దుకొమారు వేఁటతీ।
శారయనొక్కచో నిలిపియంగుగనంగబిగించిచుంగులన్।
జేరి ఁ పల్లైపాటుడిపిసింగిణిఁగోలలదూసిసింగపున్।
బాసలనేసె వేఁటరులుపల్మలుఁదన్గని మెచ్చఁబెచ్చుగన్॥ 27

క॥ ప్రముక్కిడి మెకములనొడయఁడు। లెక్కింపకతక్కువాని లేసున నె
లలన్। జక్కాడె మొక్కటీలన్। జిక్కనిసింగములఁబులులఁజిఱు
తలనంతన్॥ 28

సీ॥ నెరసరిపిండుపై నెఱసరుల్ గండుమైఁదాఁకిరిబాకుతుపాకులాడి
సి। యొంటరి తెగదూలనొంటరి తెగబ్రీల కరిగిరిగరగరసురియ
లెత్తి। మొక్కటీలడలంగ మొక్కటీలదరిరి ప్రబ్బియోదంబులఁ
బొదకొలిపి। వేఁగులువడికూల వేగులువడిఁగ్రాల వెడలిరికోలల
విండ్లుఁబట్టి। మఱియు వేఁటరులెలుఁగులమందజల్లి। మెకములనుద
చ్చియడుగుల మెకపుగముల। ఁగణఁతిదుప్పులులోనుగాఁగల మెకా
ల। ఁజెండిచెక్కాడి రెంతయుగండుమిగిలి॥ 29

సీ॥ తాముగుబ్బలిపట్టితట్టులై వెతఁబాపు కొనెదమంచెగురుచుగుండ్లు
దాఁటు। తామునిల్కడనేలతట్టులంబడిదాడి విడిమందమంచున
ల్గడలఁబాఱు। తాముచుక్కలఱేనిదండనుండినఁ జేటు వీడునంచ
డలివిన్వీధికెగురు। తాముముక్కంటికైదండఁగ్రాలినబాము లుం
డవంచటు వెలిగొండకేగు॥ తాముచిల్వలినేలఁకుఁదరలిమేల్లు। ద
నరబ్రతికెదమనిమంటిఁద్రవ్వుచుండు। సింగములనేనుఁగులలేళ్ళజం
కగుముల। నేమలను వేఁటఁద్రుంచి రేనాధుల్లపుడు॥ 30

లయగ్రాహి॥ పొంచిపొదరిండ్లఁదెరలుంచిమలలెక్కి యడరించు
మెకాలనడలించియలవారన్। మించివెసఁదోలుచునుగాంచియ
టఁగొన్నిటినిఁద్రుంచిబలుకైదువులనొంచిపొరిఁబొట్టల్। జెంచివ
ఱిపోటువిడికుంచివడిలాగులిడుకొంచుఁజనువానిఁబడలించిపల
టూపుల్। పించముడరంగఁబఱపించియుసుఱుల్దొలఁగఁద్రెం
చిచెలువొప్పఁరొగిఁజెంచులటఱేఁడున్ 31

స్రగ్ధర॥ గాలించెన్గాననెల్లన్గడిఁదిబిఱుతలన్గాల్చెసింగంపుమూ
ఁకన్। దూలించెన్హత్తిపోజున్దనిమెగాఱియలన్ద్రుంచెఁదో
డేళ్ళబారున్। కూలించెన్దుప్పిపిండున్గుదిమెసలుగులన్గూ
ల్చెమన్బోతుచాలున్। వ్రాలించెన్దచ్చికాళ్ళన్వఱలుమెకము
లన్వాల్చెఁబేరేదుగుంపున్॥ 32

గీ॥ సరిపెణలవిచ్చివిడిపింపజాగిలములు। వెడలిపసివట్టితోఁకలవిసిరి
కొనుచు। మొనయఁబరుగిడినెమకుచుమోరలెత్తి। కాంచిపందు
లజాడఁగడగెనపుడు॥ 33

క॥ అత్తెంబులఁగలడేగల। మొత్తమునెగిరింపఁగౌజుపూరేళ్ళవడిన్।
దత్తఱిలఁజేసెవెండియు। మొత్తెన్నునుగోళ్ళకొనలఁబులుఁగుల
నెల్లన్॥ 34

క॥ కడిమిమెయినిటులఁగోయలు। పడుకులలోయలనుపెలలవలకుల
గొబలన్। వడిమెకములజంపగనొడ। యఁడుచాలింపుఁడిఁకవేఁట
యననటవారల్॥ 35

మ॥ పునుఁగున్గస్తురిదాకయున్సలుగుకొమ్మున్దేనెమేల్పాఱప
ప్పునుజవ్వాదినెనంటిపండ్లుసవరంబుల్నెమ్ములన్గప్పురం
బునుబేల్కుంచెలునక్కకొమ్ములుజగాపూరేళ్ళులోనైనవా
నినిరాజావిలియొద్దబుట్టయొలమిన్నించంగఁగేల్మోడ్చినన్॥ 36

క॥ మన్నించి మిగుల హేఁడవి। యన్నియుఁ గొని యొరిమఁ దనమున ర్తిలి
నవలా। మిన్నయగు చంద్రమతికిన్। జెన్నలరనొసంగి కానచెం
చులికంతన్॥ 37

క॥ తని వారవిలువ గలపస। డనములఁ గడు నిచ్చి హేఁడు తన ప్రెగ్గడఁ గ్రొ
ని వేఁట పెంపున న్గడ। చను డెంచితి మింత దవ్వు చద లేటిదరిన్॥ 38

గీ॥ కలమతవిసివసెట్టు జోగంపుటికర్। యచ్చోటికిఁ బోయి యాలొ
జ్జహజ్జదోయి। గాంచి మాఱలు మమి దెపి చుక స్మవళ్ళపు। పద్యోరలు
డెల్పు ముద్యోఱు పజ్జనుంట॥ 39

క॥ అని తనకొమయున్ గొమరుఁడు। జను దేరఁగ వెంటఁ బ్రెగడ చం
దురుఁడును రా। గనుఁ గొను చుమలల సెలలన్। మును కొనిపోఁబో
వనొక -మురువగు కోనన్॥ 40

సీ॥ జిలవోలంగఁగ నేనుఁగుల మేనుమని గోళ్ళ చేసయింపు గగేఱు సిం
గములను। చింక కూనల కుఁ జన్నేఁపియాఁకలి దీఱఁ బాలొసంగెడు పు
లుటాలు పులుల। ఎరకేసు తల్లుల నెడసిన బిడ్డల త్రాఁచు మొత్తంబు
జొకొట్టు ముంగిసలను। గూరొంమ చిక్కెలఁ గుమి లేయునని స
ద్దుఁజేయక చనుమ్రాను చీలి పిండు॥ వింత దనరార నొద్దిక వెలసి వి
న్న। సరవిఁ జెరలాడు పులుఁగుల సాళువముల। నరసి తమ యొజ్జతబి
సిచం మరుని నెలవు। గాఁగ మదినెంచి కదు వేడ్కఁ గ్రాలి హేఁడు॥ 41

సీ॥ తిగనిల్పు బొట్ల క్రొంబగటు మించినవాని మించుసంచుడిగించు మే
నువాని। దులకింపు బలు పెంపు తొలసి పేరులి వానిఁ బేరగుజడ గ్రా
రి పెద్దవాని। చిందంబు నుడి వాలు చిన్నె దండల వాని దండనొప్పా
రు లాతంబు వాని। జింక కళ్ళాసంబు చేల చందము వానిఁ జెందమ్మిస
రముల చేతివాని॥ సంజ క్రొంజిగులీను వాల్జడల వాని। డంబు తెలి

ఊలకించవలయుఁ బంటలకోలఁది నేర్పుఁ జదియఁ జవపాలు గుత్తిఁ
గాఁపులనుండి గొనఁగవలయుఁ। బన్నుఁ గొని బొక్కసమునించుప
నినటుంచి। లేమి కాఁపుల కేమరిచ్చి లెస్సపంట। నైనఁ దిన్నఁగ మున్ని
చ్చినట్టిసొమ్ము। బడయుచును తేఁడుపగిది రాఁబట్టవలయు॥ 55

సీ॥ పాడిపెద్దలమాటఁ బాటించి యిది న్యాయ మిది గాదటంచు తేఁడె
ఱుఁగవలయు। తగవెంచుడిందని వగఁగనుంగొను పొంతెఁ గ్రిందివా
రలఁ బరికింపవలయు। దటిబట్టి యనువైన నెఱిమార్పులడరించి ప
జలు మేలొందఁ బ్రోవంగవలయు। గొనటిచీకుల కెల్లఁ దనివార నైన
రు నైనీవుల వెలయించి కావవలయు। బయిపయిం జూచి వెండియుఁ
బాటిసూటి। జాడజాణల రాఁదీసినాఁడులందుఁ। బారుపత్తెంబుల
నొసంగి ప్రజల నేల। బనుపఁదగు నంచుఁ దగవుంటఁ గనఁగవల
యు॥ 56

క॥ వలఁతియింతకు నన్నియు। దెలసిన నెఱజాణవైనఁ దెలపితి నీకుఁ।
గలువవిరిసూసఁగ్రుంకెడిఁ। జెలియుఁ గొమరుండు నూవఁ జేప్పడి
రదవిఁ॥ 57

చ॥ తడవొనరింపకీకడనుదగ్గి వెసంజను మూరికొండు మే।
ల్నుడిపను చెప్పెదఁ దబుసునో మెడుగాధియనుం గసుఁబట్టియి।
వ్యాడనొక చోఁగలండ తని యిమ్మునకుఁ జనబోకు మల్క చే।
నడరి యొకడ్డుకీడెనయ నాడిన నాడునతండు నావుడుఁ॥ 58

క॥ జడదారి కెఱఁగి వీడ్కొని। యొడయఁడు చెలిఁ గొమరుఁగూడి యొ
గినరదంబుఁ। వడి నెక్కి మఱలుచోన। వ్యాడరుంగని గాధిసూలి
యిదియదననుచుఁ॥ 59

క॥ తన నెలవునకు హరిశ్చం।ద్రుని రప్పింపంగ సుపటుఁ దోడ్తో నెడఁదఁ।

గనిపంచెయు నెట్టకేలకుఁ దనయొక్కఁడుతబుసుబల్మితలఁపునసం
తన్॥ 60

సీ॥ ముత్తెంపుచిప్ప నెమ్మోముచందముదాని నిగనిగమనుతళుకుఁ జిగుల
దానిఁ గప్పారానీడలఁగుప్పుకన్నులదానిఁబనడాలడాలీను చెవుల
దాని ఁజిలుకుపుష్పాసలనిస్సుఁజెనకుచాఱలదాని ఁగాయువెన్నెల
సౌకడుపుదానిఁ గ్రాలుపచ్చలరంగుకాలిడెక్కలదాని నుదిరి
మించిన మేనుపసటుదాని నడుమగరాలబెడఁగులతోడలదానిఁ
గాడ్పువడిమించుపేరెముల్ గలుగుదాని చిత్తరపుఁజూపుదాని
బల్జిత్తుదాని యింతయగుజింకనొండుఁగావించిదాని॥ 61

చ॥ పొడగనియీవసిష్ఠునుసిహెంతనఁగ్రాలు పొలానఁబ్రోద్దువం
గడపుఁద్రిశంకుపట్టితనగాదిలిపైదలిఁబట్టిఁగూడియు
ప్పుడెచనుచున్నవాఁడరిగిపొల్పుగునీబలునేర్పుచెట్టలన్
వడిఁగనిపించినిప్పుడయువైసికనాతనిఁదెమ్మునీవిటన్॥ 62

క॥ అనిపనిచెఁ గారపుపున్ బనిబంగరుజింకకొదమపనివినికానన్ బ
నివడియెసహరిశ్చంద్రునికంటన్ గానుపింపఁదోరపువింతన్॥ 63

చ॥ కనుఁగొనినాసమైకళుపఁగన్గవబల్బెళుకున్ దలంచిచం
పనుకాదిరాకపట్టితనపట్టికినాడుకొనంగనీదలం
పునవెరవెంచియమ్మెకమువోయినజాడనెతేరుఁదోలఁజ
య్యనసెలవిచ్చి ఱేఁడటులనయ్యెడవింబడివెంటనంటినన్॥ 64

కం॥ గాలివజీరునితేజన్ బోలివడిన్ బాఱు వేలుపులబువ్వయొదన్
గ్రాలుతమకొలఁపుటిష్టిన్ దేలికనందుక్కొనుమాడిఁ నెత్తిఁబైకె
గరున్॥ 65

లయగ్రాహి॥ ఈఱసుబల్పొదలఁగూటి చెలువారనటఁదాటికరి

యావలికిఁబాఱితొలిమించున్। మీఱఁగలనైతళుకుఁజూఱికలఁజూ
పిదయువాఱఁదమిగొల్పిపలుమాఱుదొరచెంతన్। నాఱుఁదిననిల్చి
యలుపాఱమఱిఁబండిపలుకొఱియలువడ్డవగదేఱు పఁగనెంతో।
నూఱడిలివెండితనవేఱడముఁజూపవడిజాఱిమెయిఁ గొమ్ములనుగి
ఱుకొనుజింకన్॥ 66

సీ॥ పట్టడాసిననద్దిపట్టికమున్నెఁగునలుకనొంపఁగనున్నఁగెలనదోఁచు।
ఁజికెౘ్ఱనంచోడియఁబోఁజేయుఁకపరుగెత్తుఁగదియఁగాఁగాన్పిం
చకయమొఱంగు। వలఱొడ్డనావలివలనికిఁగుప్పించుఁ బొంచి
చేరినజుమాయించిమించు। దొరికెనంచాఁచినఁదొలఁగిదవ్వునకే
గుఁజమునవిల్లెత్తఁగట్టెమటమెలఁగు। నందఁజేఁజాఁపనెగిరిమున్ముం
దుకరుగు। నొకౘ్ఱచోడాఁగివేఱొకౘ్ఱచక్కౘ్ఱకేగు। నవ్విధంబున
నెలయించియవ్వజీరు। గాధికొమరునియారాముకడకుఁదెచ్చె 67

గీ॥ పట్టువిడకిత్తెఱంగునవట్టియాసఁ। గొలిపికికురించితెచ్చినకొదమజిం
క। నలుకనొంపంగదొనఁదీసియమ్మునేయఁ। పిచ్చుమొగ్గయ్యెఁదు
దకదివేడబమున॥ 68

క॥ జడదారిగాధికొమరుని। యొడకుంజనిపంటవఱయెలికతనవె। న్వ
డియేతెంచినవైనం। బెడవకయెఱిఁగించియతఁడెమట మొఱం
గెన్॥ 69

గీ॥ అంతనగ్గారడపుజింకనంటికడిఁది। కాఱుకోనలఁబడుకులఁగట్లఁజె
ట్లఁ। గ్రంతలంబడివచ్చినకతననొడయఁ। డలసిదగఁదీర్చుకొనవెం
చమరయఁజనఁగ॥ 70

తరళ॥ కడిమిమేడులుఁదాంద్రజువ్వలుగంగరేనులుమట్టులున్। గొడి
సెచింతలుదేవదారులుఁగ్రోవిపొన్నలురేఁగులున్। గడుమరిడెలు

మావులిప్పలుఁ గానుగంమగు తేఁకులున్। గడపనిమ్మలనంటులున్ గ
లకానఁ గన్గొనియయ్యెడన్॥ 71

చ॥ చెలిమిని గాయలున్ గొదమసింగములున్ బసిదిండులిట్టులున్।
జిలుపలుఁ జుట్టుపుట్టలును జిట్టెలుకల్ చిఱుచీలిపిండ్లు జా।
గిలములు నేవరుల్ పవిలి గ్రేణి నినొండొరులోలి నొద్దికన్।
జెలఁగుటఁ గాంచి యచ్చెరువుఁ జెందివజీరుఁడు వెండిమున్జనన్॥ 72

సీ॥ ప్రామినుఁ కొనల నేర్పడు తెల్వియిట్టిదం చంకించి పలుకుగొర్వాం
కగుములఁ ముకుళలఁ బనసల నొక్క మెక్కసారాలఁ బనసలను డి
వెఁబరితములను। పరికించి డీకలేర్పడు చిపున్నెపుకబ్బ ములచొ
ప్పుఁ దెలుపు రాచిలుకపముగు। వేల్మిక్రొంబొగనింగి వెడలు మబ్బు
లటంచు నెమ్మిఁ బాతరలాడు నెమ్మిగుంపుఁ। గాంచియదియొక్క తబి
సిముకఁ గంటియుంపు। పట్టుగా నెంచితనదునీగ్వట్టుఁబొవు। కొ
నగఁనయ్యెడనీర్పట్టుఁగనఁదలంచి। ముందునొకకొంతదవ్వేగ బ్రమో
లతేఁడు॥ 73

సీ॥ జానొప్పఁ గానీటిపైనల్లుకొనియున్న నింపునాఁచదిజడగుంపుగాఁ
గ। తమ్మినూఁడులమెక్కఁ గ్రమ్మురాయంచల వన్నెమై తెలిబూది
వన్నెగాఁగ। విచ్చుచెంగల్వక్రొవ్విరిబంతియొడలున దనరినరుచు
రాకదండగాఁగ। ప్రోవులైయల్లుపూదీవెలుమైదీఁగెఁ దాల్చినను
నుజన్నిదములుగాఁగ। వ్రాలుతొవరేకుచిలుకకొప్పాలగాఁగ। నీ
టిబొట్లూను పటికపుస్జేరుగాఁగ। బరఁగజడదారి చందరుపగిది వెల
యు। నొండుకెందమ్మికొలఁకువుదండఁ గాంచి॥ 74

క॥ కని చెలియుఁబట్టితానును। దనరిన పేరెలమిఁ దేరుఁ దిటుకు నడిగిచ।
ల్లనినీరుఁ గ్రోలియన్నడు। గునదరినీ ఱంపుఁ బొదలగున్నలనీడన్ 75

క॥ అలపెడలఁ జంద్రమతితోడ। తలయంపిగఁ జేర్చి తలిరుఁదలిసంబ
పయిన్। జెలువుగఁ బరుండి యొడయఁడు। కెలన సురటి వీచు సత్య
కీర్తిన్ బెగడన్॥ 76

క॥ కనిమిసులఁ జూట్కి కింపై। పొనరెడి నిచ్చోటు వెళ్ళిపోవలును గడుఁ
గా। క్లౌనుచున్న దిద్దియేరుసి। మనికియొ తెలియంగఁ దగును మన
కన నాలోన్॥ 77

గీ॥ పండ్లుగోయంగ నపుడు శోకపడుగఁడటకు। వచ్చియచ్చక్కి రుసిగా
ధిపట్టిదనుచుఁ। దెలియఁబలికిన నాప్రొద్దు కోలపుటూడయ। దసహ
రిశ్చంద్రుఁ డెడఁదనుమికులనొగిలి॥ 78

క॥ ఇఁకనేమి గాఁగనున్నదో। యకటా యిండ్లపుగ నలపదనిమిసు నెం
తో। నకునికి నుడివిన వహింవ। చ్చికను వసిష్ఠుం డెఱుంగఁ జెప్పెన్
నాకున్॥ 79

గీ॥ చెప్పియును జేయము జచితిముప్ప మూఁడు। టకుఁ గతంబయ్యెఁ గా
కున్న మెకము దేడ। కెలనఁ గాన్పించి యొలయించి వలల సెలల। నె
డఁదఁ బురికొల్పి తెచ్చు నేయింత దవ్వు॥ 80

గీ॥ నలువ కట్టడి దాఁటఁగా నలవియగునె। కాఁగనున్నది తప్పక కాక మా
న। దైన వెరవొందు నారయు మాకడింది। తపసి డాయుటూ లేకిం
దుఁ దరలిచనుటూ॥ 81

గీ॥ అని రాజారియొసుమంత యనిగికనిన। ఁబొస్న గట్టైనఁ బడి క్రుం
గుఁ బుడమిడాలు। పైనవడి బ్రుంగు నెలప్రొద్దు తైన గ్రుంగు। దురుస
త్వంబలక ముక్క పైవొరయు వాఁడు॥ 82

క॥ అనితలఁకు హరిశ్చంద్రుని। గని పెగ్గడ సత్యకీర్తి కరమీకరణిన్। వన
రఁగనీ కేటికినో। విను కెంపుకొలంబు కడలి వెన్నెల తేఁడా॥ 83

కం॥ వాఁడిగలాఁడవు ప్రోడవు। వేఁడెడిపజపాలిపాఁడి వెలి మొదవవు
బల్। పోఁడిమిఁ బాడియుఁ గాంచిన। వాఁడవు నీపైన సలుగు వా
రుంగలరే॥ 84

ఉ॥ అంచుజగంబు పొంచుడిగి యాముడిగించి కరంబుడంబునా।
సందిగనాడి యీనెడలి సైరణచేమది నించి గాలిన్।
చందికడించి కాఱుడమి నాఁడెలికిన్ వలికెంటకోర్చియో।
జందబు నూను మేటిగుసి చంమరులూరక కంటగింతురే॥ 85

చ॥ అదియును గాక యిందడరు నాతఁడు గాధియసుంగుఁ బట్టిము।
న్నొదలఁగ మీకొలంబునకుఁ బొంపును నింపిన మేటి యీతఁడే।
కదనినుఁ గన్న రాచతలకట్టుఁ ద్రిశంకుని బొందితోడనే।
ల్పదవికిఁ బంపినట్టిసుడి వాన్గొరయేటికి జంకె దివ్వగన్॥ 86

చ॥ అరుమగఁ గల్గుఁ బోకసరొకప్పుడు గల్గిన ద్రుమ్మగ్గు వేగవా।
పిరిఁ గడుఁ జల్లనౌ సెనరు వెల్లువలుల్లము లెప్పు వారికిన్।
గెరలియు వారలొకర్రికిఁ గీడొనరింపరు మేలు నేతలం।
తురు తలఁకీఁగి పూఁగుమిటఁ పోడెము వచ్చిన సేదదీఱఁగన్॥ 87

కం॥ అనవలపుసనఁగనించుక। గను మోడిచియంతలోనె కనరానిక
లన్। గని తేఁడుగలవరంబునఁ। దెనమఱకటు లేచినాల్గు దెసలుం
గనుచున్॥ 88

గీ॥ కన్నుఁగవనీరు గాఱ నైగరము వఱఁక। ఁడ త్తరముఁ గన్నయులసతక
త్తళ్కాన్। తగవరికొలంపుదొరయగుమగని వెన్నుఁ। జఱచిచెలిచం
ద్రమతియంత వెఱపుఁ బావ॥ 89

కం॥ ఫులుదిండిరాలుఁ బచ్చలు। డస్తునిన్ మగరాలు గ్రాలునైనచేకడె

ముఁ। వెలయంగనాడ్బ్రుమున్మ్మజు। వలఁతికిదిగఁబడి విటీసివ్వైచి
బిరానఁ॥ 90

క॥ మిన్నొన్నెఅగిన్నైనఁబడినఁ। జెన్నెడలవువిన్నఁదనముఁజెందవుపడి
గా। మిన్నానెయెన్నండియ్యెడ। బన్నమువడియిటులనులికెపడెదవి
దేలా॥ 91

సీ॥ కడిఁదివేరంపురాపుడమిడాల్పులపాలి వాఁడిక్రొన్ముగరాలవాలు
దొరవు। మఱుఁగుఁజేరినరాచగఱువలవెఱమాన్పు నుఱవుగాంచి
నమేటియుజెయపీవు। సతసంగ్రమములుదాఁక చనునేలనేలఁగాఁ
గ్రాలినరాచముకొఁటివీవు। సతమునికుముజగాప్రతిననాఱట
లేని ప్రౌఢ్ఢువంగడపురాపెద్దవీవు। నిండుదిట్టంపుజాళువాకొండ
వీవు। తగవువెరవులనెఱిఁగినదంటవీవు। వేల్పైవడిరహిఁజెడిబెద
రియిటులఁ। దలఁకెదేటికినిమ్మాడిఁగలవరించి॥ 92.

క॥ అననాలోపలనెమ్మదిఁ। దనరినవాఁడగుచురాచశశిచంద్రమతిఁ।
గనియిపుడొకకలఁగంటిఁ। వినుమదినెఱబీతిగొలుపువెలఁదిరోవ
దికిఁ॥ 93

మ॥ చెలినేఁగొల్వయియుండఁగానటకునంజేరన్వడిన్డాసిబి।
ట్టలుకన్బాలుఁడొకండునాబొమడికంబంతన్బడన్ద్రోసిప్రో।
ల్గొలఁగన్జేసినఁబాసిగాసిలియుఁదోడ్తోవాసిమున్నట్లురా।
కలిమిన్సుబ్బలిదాల్పుక్రొన్నెనరుచేఁగంటిన్జగంబౌననన్॥ 94

చ॥ అనివినిపింపఁజంద్రమతియంగదఁగుందియుఁబైకిదిట్టమున్।
గనిమఱిదీనికింతవగఁగందఁగనేటికిమేటిఱేఁడనె।
కొనినకడిందివంతలవిగాలుఁబదంపడినిండుపేరిమిన్।
గనియొదవెట్టులన్నఁగలగన్నినచందమువిన్నవించెదన్॥ 95

గీ॥ కలఁగనుంగొన్నపాఱుఁడీగాధిపట్టి: పిదపబామడికి మెడలినవిత
ముఁదలఁప। నడలిరాలచ్చిఁబాసి పెంపఱుటవెండి। తొంటిసిరిగాం
చుటదిగంటదొరతనంబు॥ 96

క॥ వచ్చుఁగీడదియప్పుడె। విచ్చుఁబ్రొద్దుట్టమంచువిచ్చినకరణిన్।
ఱిచ్చపడ నేటికిడుములు। వచ్చుఁబోనెడపకెట్టివారికినైనన్॥ 97

క॥ అనియిట్లుతగు తెఱంగులఁ। దనపెనిమిటినూఱడించి తత్తరమెడఁ
దన్। గననీకమినులదిట్టం। బొనరఁగఁజంద్రమతినుడువుచుండఁగ
నాలోన్॥ 98

క॥ కినుకయునుకిఁ-వమున్ లో। ఁగనిగాధియనుంగుఁబట్టికడకొలపుజ
గా। ననబోంద్రనిరువుర్ వడిఁ। బొనరించెన్నలువనెనయుబ్రోడ
లుతబుసుల్॥ 99

సీ॥ దరిఁగ్రాలునేనుంగుపరిఁబట్టియవ్వాని తలలఁబాలిండ్లుగసలిపెనే
మొ। కడనున్నసింగంపుగమిఁదెచ్చియవ్వాని నెలఁతలకొసులన్ని
లిపెనేమొ। కుఱఁగటంజనుజింకకొదమలఁగ్రైసేసి యువిదలకన్ను
లనునిచెనేమొ। సరసఁద్రైవాఱెడసవరంపు మెకములఁ గొని
వానిజడలనుగూర్చెనేమొ। యొండుకొఱముట్లులేకయయొద్దమె
లఁగు। మెగపుసమిఁజేర్చిబ్రేల్మిడిమెలఁతదోయి। వాసినొనరిఁచె
బళిగాధిపట్టినేర్పు। విప్పనేమనినోటనుజెప్పనొప్పు॥ 100

సీ॥ గోములైరేయెండగాములైనునుపళ్ళు- గీములైకొఱరునెమ్మోము
లమరు। మెప్పులైకప్పురాచొప్పులై తేంట్లుడా ల్విప్పులైగొప్ప
లైకొప్పులొప్పు। పప్పులైవలరాచతూపులైతరితీపు దాపులైక్రొ
వ్వాడిచూపులెసఁగు। సొంపులైనిద్దంపునింపులైయుద్దంపుఁబెంపు
లైపొంపాగుచెంపలొనరు। కుమురునెలరేకచమురులైనుమురులొ

దవు। కావి వపులీనువపులై మోవులోలయు। నజ్జతలి రాకునాజ్జలై
హాజ్జలెలయు। పల్లెతలకంబునుగ్గడింపందరంబె॥ 101

చ॥ విలువవసింది తేళ్ళు నెలవిందముపుట్టలఁ బూఁటి విచ్చులో।
పలఁబడి ప్రాఁతిమేసెనిను ప్రాఁకియుడంగుచు నీటఁడాఁగియా।
కలనెజివంచెఁ గ్రాఁగె వెఱదాఁటులఁ బర్వెడుఁ గందెనార్చెబి।
ట్టుజడ మేనుగన్నె మొగమ్ములకున్ దొరగాక సిబ్బితిన్॥ 102

క॥ చెండ్లాపాలిండ్లానుఁ పిండ్లాకన్నెవలు విల్కి పిండ్లాపలుకుల్।
దూండ్లాకేల్గవలవ్వా। బోండ్లన్ బొగడంగ నేండ్లఁ బూండ్లంబ
ట్టున్॥ 103

సీ॥ చెఱకువిల్లూని వాతెఱతీపులోనరించి యలుకఁ జూపులఁ జూపులందవ
మర్చి। తుమ్మెదనారి బల్లురుములనడరించి విలుకత్తె తడిఁ బల్కులో
లుకఁ గూర్చి। తెఱగంటి టెక్కియఁ దెలికన్నులన్నిల్పి గాడ్పు తేరూ
ర్పులకడఁ దలిర్చి। తొగనంటు చెలికాని మొగములనలరించి కోయి
లకండలుంగులను జేర్చి। చెలులనల గాధికోమారుఁడు సేయమ
రుఁడు। "బలిమిచెడెనింక సిగ్గెలబతము నెడిన సుకముఁగనఁడగు"
నంచుఁ దాసకులఁ ప్రాపు। గాంచెనో యనఁ బొల్తురక్కింపు బొం
ట్లు॥ 104

॥ నెలయుసులోకకోఁగలుగనే కలిగెఁగా నెమ్మోముక్రొవ్వెదల్
నెగడుకతన। విరిదమ్మి వెన్నెలలోరినునుండు నేయుండెఁ గన్నుల
నవ్వులకలిమికతన। సంపంగి తేఁటులుజతనూడు నేమూడె ముకు
మ్మూటుకలో కోటమొనయుకతన। సింగమేనుఁగులోలిఁ జేరునే
చేరెఁగాఁ గౌను పెందొడలుదాపూనుకతన। నొరజగము పెద్దయ
సరంచరారౌతు। నేఁతకొండక్రొత్త నేఁతగాఁగ। గాధిపట్టినే

సెఁగాఁబోలుననియంప। జూడుకొనఁగఁబొల్తురలరుబోండ్లు 105

॥ మీలాకన్నుంగవపగ। డాలావాతెఱలుపైఁడిడాలామేనుల్। వా
లానెఱులుజగాముగ। రాలాపల్వరుసకిప్వారాలాపలుకుల్॥ 106

॥ గాధికోమునిచేఁతపైక్రాలుచెలుల। మొగములనుగాంచియటు
లసేయఁగను నెలను। పురుడురామియు నెల నెలఁబూని చెఱది। చే
యుచున్నాఁడుముదిమిఁదాఁజెడియునలువ॥ 107

సీ॥ చిలుకలనొనరించి కెలన మెకరుఁగఁజవుల్ మించుమేల్దాండపం
డ్లుంచినాఁడో। వెన్నెలపిట్టలఁబన్నియానఁగనండనించి రేయెండఁ
గావించినాఁడో। చిలువలంబసఁజేసి కెలఁకునఁగ్రోలంగఁబవ్వారల
ను నేఱుపఱచినాఁడో। గౌరులంబొనరించివొరెమ్మలనుగూర్ప న
నఁటికంబంబులనునిచినాఁడో। యనఁగఁబలుకులుఁబెదవులుఁగను
లునగవు। లారునూర్పులునడలునునడరుతొడలుఁ। దనరిమొనలేని
సింగారమొనరిమిగుల। జిగులమీఱుచురమ్యాలచిగురుబోండ్లు॥108

చ॥ చెలులబెడంగుక్రొంజడలచెల్వునకుఁ సరిరాకబీతిచే।
ఁజిలువలువిన్నుజుట్టుదొరచెంగటఁజేరిననంచు నెమ్మియూ।
నెలఁతలపజ్జనాటఁదొలినేర్చినదౌటనుగొంచగొంగరా।
వొలిమెపటాణిమైపగఱనొజ్జలడెందమెలర్ప నేఁపెడిఁ॥ 109

సీ॥ మోములునెలలయిమొనయఁగాకుండిననింతులనగులురేయెండ
లగునె। కెంపువాతెఱలుచకోరలుగాకుండినఁ దెఱవలపలుకు
లుదీపులగునె। పొక్కిలుల్ కొలఁకులై పొనరుఁగాకుండినవిరిబోం
డ్లతఱులుచాత్తురఁగలగునె। మేనులుమించులై మెలఁగుఁగాకుండిన
మడఁత్తులక్రొవ్వేదల్మబ్బులగునె। కన్బొమలువిండ్లుగాకున్నఁగ్రా
లుగంట్లు। చూపులవితూపులగునెయాసొబగుచెలులు। మరునిసై

చెల్వు నెల్లఁ దాల్చిరికడంగి। కానిచో వాఁడు మైకల్మిఁ గనకయు
న్నె॥ 110

గీ॥ పుడమిముద్దువుంటయొక్క యబ్బురమెయనుచు। ఁదలఁదియుప్ప
రముననొండుకొలఁకు గాథ। కొమరుఁడొనరిచెననఁగ నాకొమ్మలకు
ను। వెలయుఁగొనలఁబొక్కిలుల్ చెలువుదొలుక॥ 111

గీ॥ కన్నుఁగవకోడిపాటనకన్నె లేడి। కెడమొసంగిన నెలమోములో
డిచితెచ్చి। విదిరియిరుచెంపలను నొంప వేఁడఁగొమలు। చుక్కలో
గిఁ కాళ్ళఁబడెననని కుక్కగోళ్ళు॥ 112

సీ॥ జడలఁజిల్వలగాముసడరంచిపగయింక మెడసంకువలఁతిగ మెలపె
నేమొ। చనుఁగొండలనొనర్చిచనువుంపఁబన్నులమగరాలదాల్లో
రమనిచెనేమొ। మేనఁబూవిల్తుచెల్వానించిడెసఁబావ మొగము
లనెలదారిఁబూన్చెనేమొ। కనులఁగల్వలఁజేసికంటూడఁబాలిం
డ్ల జక్కవపొంచుంటసలిపెనేమొ। నలువ సేతకుమాఱూనఁదలఁ
చి వేర। మొండొరులకొండనీయక యుండనిటుల। మాటవాసిగగా
ధికొమారుఁడెసఁగ। ఁజేసెనోయనమించునచ్చెలులరూపు॥ 113

సీ॥ చందురువంకలో చానలనుదురులు కస్తురి నిగరాలె కటియనెఱులు।
సంపఁగులొముద్దుజవరాండ్రముక్కులు గుత్తిలుగుత్తులొకొమలచ
నులు। బంగారుతీఁగెలొపడఁతులమేనులు మెఱుఁగుమంకెనలెవా
తెఱలబెడఁగు। పగడంపుఁదీవెలొమగువల కేల్దండలలగవ్వ సరులె
యాచెలులగోళ్లు। వెలయలత్తుకబొత్తులజ్జలుబళీర। మరులుమరు
వంపు మొలకలో మానికములో। కలిమిపంటలో చామలోకన్నెస
రులో। యనఁగమీఱుదురవ్వాలయలరుబోండ్లు॥ 114

గీ॥ అంచఁజిలువఁబైఁడినఁటిసంకుల గెల్చు। నడలుజడలుసోడలుదో
డలుమెడలు। తరఁగచాలుమొయిలుదాఁటులఁగదలించుఁ। దరులు

నెఱులుకురులుమురులునురులు॥ 115

గీ॥ కలిమివెంటనె లేమిడిగలుగునంచుఁ। గడఁగిజగములకెఱిఁగింపఁగా
ధిపట్టి। కలిమిగుబ్బలమఱి లేమి కౌనులంచుఁ। గలుగఁజేసె నోయన
మింత్రుక్రాలుగంట్లు॥ 116

గీ॥ కౌను లేదనినూఁగారుకలువకలముఁ। బూనిహెక్కిలియను “కలం
దాను” నద్ది। యచ్చటనెమూఁడుబంతులునలరువిల్తుఁ। డెలమిఁ వ్రా
సెనోయనఁదరుల్ చెలులకెసఁగు॥ 117

గీ॥ కేలు లేఁడిఁగెలలచనుల్వ్రాలగుత్తు। లడుగులిగురాకులలమోవులో
డియునలరుఁ। దేనెసోనలుఁదలఁపన త్రీవబోండ్లు।కొలఁదికెచ్చినచ
కరనిక్రోష్ఠలౌర॥ 118

గీ॥ నిమ్మపండ్లుచనులు నే రేడుపండ్లుక్రో। వ్వొదలుదొండపండ్లు పెదవు
లౌర। కనులపండువొప్పఁగన్నులమ్రాన్పండ్లు। నాఁగమించునోరి
మనాతిదోయి॥ 119

సీ॥ ఓమనగుంటలాఁచాములహెక్కిలుల్ చీఁకటిమొటికాయచెలులకు
రులు। జాబిల్లిమొగములచందమామఁజిపుట్టచెండ్లాబిటారినెచ్చె
లులచనులు। దాఁగిలిమూఁతలాతలిరుబోఁణులకౌను లలపిల్లగ్రోవు
లాచెలులయెలుఁగు। వెన్నెలకుప్పలా వెలఁదులనగవులుతుమ్మెద
రేఁపుళ్ళుతురుములౌర। యాటలకునెల్లవాటంపుటాటపట్టు। లై
చెలంగఁగనలగాథియనుఁగుఁబట్టి। దనదు నేరుపుఁజూపట్టఁదలఁచి
మలచి। చేసెనోయనమింతురచ్చిగురుబోండ్లు॥ 120

గీ॥ పరువమనుతోఁటఁబూవిల్తు పంటకాఁపు। చేరిహెక్కిలిదొనస్సుండి
యారుకాల్వ। నీరుఁగట్టినఁబండిననిమ్మపండ్లు। నాఁగనొప్పారుఁ
జను లెలనాఁగలకును॥ 121

గీ॥ చనులనొక ప్రకరఁబిఱుఁదులజంటనొకర। ప్రకరఁద్రాసునమరుఁడ
నుబచ్చుపూఁచ। వ్రాలు వ్రేఁకకుదూసిన కేలునాఁబి। దారమునఁగను
జెలులకొప్పారునారు॥ 122

సీ॥ క్రొల్లంట్లకన్నవర్ణ గాంచియాసొబగందఁజేతబిత్తరిచూపుజింకఁదొ
ల్చి। యన్నులజడతీరునరసియవ్వాహిఁగాంచ నిడుపమన్నియలఁ
దా మెడనమర్చి। నెలఁతలకొనులఁదిలకించియాచొప్పుఁ జెంద
నొదలమినుసిగనుగూర్చి। జవరాండ్రనుదురుల సొవఁజూచియా
సొంపు నలవడనడినెత్తినెలఁగుదిర్చి। కొండవిలుకాఁడుదబుసూ
నికొంతపాటి। యలవడఁగఁగొమ్మసాముదూపమరినిండు। చెలువు
వొలయమిఁగాలుగుట్టలనుదబుసు। ఁజేసెఁజేయుచునున్నాఁడుచే
యు నెపుడు॥ 123

చ॥ అలజనరాండ్రజవ్వనపుటామనియోయనమిఱుఁబలుకఁచి।
లకలుఁబలుమల్లె మొగ్గలునుగన్మనివా తెఱ తేనెలొలిఁబొ।
కిఁకలిసురపొన్నపూవులును గేల్నునుదీవె తెలుంగుగఁడుఁగొ।
యిలలునుగొప్పతుమ్మెదలు నెంతయువింత సెలంగఁజూడ్కికి 124

క॥ లేళ్ళాకన్నులుమావియి। వుళ్ళావా తెఱలురవలపొళ్ళాపలుతాఁ।
బేళ్ళామీఁగాళ్ళరయమొ। సుళ్ళాసిగలెన్నఁ జెలులగోళ్ళాచు
కరల్ ॥ 125

గీ॥ పేర్చిముజ్జగములవలపింపఁజేయఁ। గలుగునీపల్లెతలఁదనకడిఁదితబ
పుఁ। గలిమిఁగావించితనపూనికఁడలఁపుఁజేసి। వారిఁగనుఁగొ
నియాగాధిపట్టియంత॥ 126

గీ॥ ఇచ్చటికిహరిశ్చంద్రుఁడువచ్చి వేఁట। తమకమునదిండునలసటఁద
విలితనమ। నింతిఁగొమరునితోఁగూడియుప్పడించు।నొకకయాకు
టీరంబుననున్న వాఁడు॥ 127

